కై్రస్తవసంఘమునకుగూడ శాసనసభలలో ప్రత్యేకప్రాతి నిధ్య మిచ్చుట సమంజసమును, ధర్మమును అని మనవి చేయుచున్నాము. ఈ ముఖ్యవిషయమును పరిష్కరించుటకై మా వాదమును అఖిలపక్షమహాసభవారికి నివేదించుచున్నాము.

తరువాత అధ్యక్షు డీ క్రింది తీర్మానమును ప్రతి పాదించెను.

## 14. నివేదిక పూర్తిగా నామోదించుట

"నెహ్రూనివేదికలోని వివిధవరతులు పరస్పరసంబంధముగలిగి యున్నవి గనుక పైతీర్మానములలోని యొడంబడికలన్నియు, నెహ్రూ నివేదిక ఆమోదింపబడినయెడల సంపూర్ణముగా నామోదింపబడవలెనను ఊహమీద నాధారపడియున్నవని ఈ సభవారు ప్రకటించు చున్నారు. మరియు నెహ్రూనివేదికను సంపూర్ణముగా నామోదించెదముగాని, దానిలో నేదోఒక భాగమును మాత్రమే ఆమోదించమని ఈ అఖిలపక్ష మహాసభలో హాజరయిన అన్నిపక్షములవారము ఒప్పుకొనుచున్నాము.

అన్ని పక్షములవారును సమ్మతించినయెడల యీరాజ్యాంగవిధానమునం దేమార్పులైనను చేయనచ్చును."

ఈ తీర్మానమును ఒక్క సభ్యుడు మాత్రము అంగీకరించలేదు. తక్కినవారందరును ఆమోదించిరి.

15. ఆఖరుతీర్మానమును అధ్యక్షుడు దువపాదించెను. అది యిట్లున్నది.

"భారతీయుల సందేశమును పాశ్చాత్యప్రజల కెరుకపరచ వలసినదని పాశ్చాత్య దేశములను సందర్శించుటకు వెడలనున్న శ్రీమతి సరోజినీదేవిగారిని అఖిలపక్షమహాసభవారు కోరుచున్నారు. మరియు స్వాతంత్ర్యమును గడించి ప్రపంచశాంతికి కారణ భూతులగుటకు భారతీయుల కృతనిశ్చయమును గూడచాటవలసినదని దేవిగారిని ప్రార్థించుచున్నారు."

ముగింపు

పండిత మదనమోహన మాలవ్యాగా రంతట అధ్యక్షునకు వందనము లర్పించిరి. మహమ్మదాబాదు మహారాజాగారు ఆమోదించిన మీదట మహాసభ వారు సంతోషపూర్వకముగా తీర్మానము నామోదించిరి. అధ్యక్షు డుచితరీతిని ప్రత్యుత్తరమిచ్చెను.

సభను జయప్రదముగా నిర్వహించుటకు తోడ్పడిన లక్ష్మణపురవాసులను, శాంతిసైనికులను, యితరులను అభినందించుచు పండిత మోతీలాల్ నెహ్రూగారుతీర్మానము నుపపాదించిరి. శ్రీమతి సరోజినీదేవిగారు తీర్మానము నామోదించిరి. కరతాళధ్వనులతో తీర్మాన మంగీకరింపబడెను.

అంతట అధ్యక్షుడు మహాసభను సమాప్తిజేసెను.

ఓం శాంతి శ్శాంతి శ్శాంతిః

తెలుగు విజ్ఞా...